ష్మని నిర్వచించుటకుఁదగు నవకాశము లేక నీ సంప్రదాయములన్నియు నించుమించుగ విశీర్ణములై ప్రకృతమున భ్రష్టములైనవని చెప్పనొప్పును. ఏది యెట్టులైనను శైవ వైష్ణవ సంప్రదాయములను సూచించెడి ప్రజావిశేషములను వ్యవహార విశేషములును సుస్పష్టముగఁ దెలుపు సంప్రదాయములు. నిలిచియున్నవి. అందుఁ బాంచరాత్రము ప్రధానముగఁ గల్గి ప్రారబ్ధమైన వైష్ణవ సంప్రదాయము తెంగలి వడగలి యని భేదముచే ద్వివిధమగుచున్నది. మధ్వసంప్రదాయమునకుఁ జెందిన ఉత్తరాదిమఠము, రాఘవేంద్ర మఠము, వ్యాసరాయ మఠము, అను మొదలగు మఠ సంప్రదాయములు వైష్ణవమునకుఁ దెలియవచ్చుచున్నవి. రామానుజ సంప్రదాయము శ్రీవైష్ణవమనియు. మధ్వ సంప్రదాయము వైష్ణవమనియు వాదవిభేదముంబట్టి వ్యవహరింపఁ బడుచున్నవి. రామానుజానువర్తులు విశిష్టాద్వైతులనియు, మాధ్వులు ద్వైతులనియు వ్యవహరింపబడుట యెల్లరకును దెలిసిన విషయమే గదా ! వైష్ణవులందుఁ దెలియవచ్చు విభేదమువలె శైవమందుఁ గూడా ద్వైత విశిష్టాద్వైత భేదము గానవచ్చుచున్నది. ద్వైతవిశిష్టాద్వైత భేదముకంటె భిన్నముగఁ బరమ శివాద్వైతమను వాదవిశేషము గూడ శైవులందుఁ గలదు. కాని ప్రకృతమున శైవమునందు సిద్ధాంత విభేదములను దెలిసికొనఁదగు నవకాశము లేనందున శైవ సంప్రదాయములు చీకాకు నొందుచున్నవని చెప్పితీరవలయును. వైష్ణవులకు బాంచరాత్రమట్లు పాశుపత తంత్రము పరమ ప్రమాణముగాఁ గల్గి ప్రవర్తించిన శైవ సంప్రదాయములన్నిటికి ప్రధానలింగముగ లింగధారణము పరమ ప్రమాణముగఁ గల్గిన ప్రజలే ముఖ్యలింగములు. పాంచరాత్రోక్త వైష్ణవమునకు దప్త శంఖ చక్రాదికమెట్లు ఐకాన్తికనియమమో యటులనే పాశుపత తంత్రానుయాయులగు శైవులకు లింగధారణము ఐకాన్తికనియమ మగుచున్నది. తప్తశంఖచక్రాది సంస్కారము హేయమని తలంచు వైష్ణవ సంప్రదాయములు గూడఁ గొన్నిగలవు, అట్టి సంప్రదాయములు ప్రకృతమున వైఖానసులనియు, గొందరు వల్లభులనియుఁ జైతన్యులనియు

సుప్రసిద్ధముగఁ దెలియవచ్చుచున్నారు.

ఇక శాక్తేయమునుగూర్చి యోచించవలసినచో శైవులట్లుగ వైష్ణవులట్లుగాని ప్రత్యక్షముగా శాక్తేయులమని వ్యవహరింపు యీవిషము దేశమునఁ దెలియవచ్చుటకు నవకాశ మించుకేనియు లేక శాక్తేయమన్న వామాచార నిష్ఠతో నొప్పారు స్త్రీ దేవతారాధక సంప్రదాయము. అట్టియారాధనయు శాక్తప్రమోదమను గ్రంధవనఁ బ్రదర్శింపఁబడిన విధానములతో నందుఁ బ్రదర్శింపఁబడిన దేవలతో నెద్దాని నేని యుపాసించుటయే ముఖ్యముగాగలది: అట్టి యుపాసనములు ఉపాసకులచే సాధారణముగ మహావిద్యలనుపేర వ్యవహారమును గనుచున్నవి. అట్టి దేవతా తంత్రము లిట్లు వరగుచున్నవి.

1 కాళీతంత్రము, 2 తారాతంత్రము 3 షోడశీ త్రిపురసుందరీతంత్రము 4 భువనేశ్వరీ తంత్రము, 5 ఛిన్నమస్తా తంత్రము, 6 త్రిపురభైరవీ తంత్రము, 7 ధూమావతీ తంత్రము, 8 బగళాముఖీతంత్రము, 9 మాతంగీ తంత్రము, 10 కమలాత్మికా తంత్రము, ౧౧ కుమారీ తంత్రము, 12 దుర్గాతంత్రము.

పై పండెండింటిలో కాళీదేవతను బ్రధానముగాఁ జేసికొని యుత్తరదేశీయులు, త్రిపురసుందరీ దేవతను బ్రధానముగాఁ జేసికొని దాక్షిణాత్యులును, దుర్గాదేవిని బ్రధానముగఁజేసికొని సామాన్యముగ నందరును ఉపాసించుచున్నారు. ఇట్టి దేవతోపాసనమును వామాచార విధమున ననుష్ఠించువారలు ఎల్లకాలములయందును వైదికనిష్ఠాగరిష్ఠులగు శ్రీవిద్యోపాసకులచే ననఁగా భారతీ సంప్రదాయము వారిచే నెల్ల కాలములయందును వైదిక దూరులుగఁ బరిగణింపఁ బడుచు నేయున్నారు. అట్టి నిందనుండి తమ్ము గాచికొనుటకై తమకు వైదికత్వాభాసమును సంపాదింపనట్టి సంప్రదాయములయందలి విద్వాంసులు సర్వవిధయత్నములఁ జేయుచుండుట భారతభూమియందొక

వింతగాదు. అట్టి ప్రయత్నములలో తాంత్రికగ్రంథ రచనావిశేషమును నగ్రిగణ్యముగాఁ దలఁచి యొనర్చుట యన్యతమమై వెలయుచున్నది. అయ్యదియే పౌరుష తాంత్రిక గ్రంథముల యుత్పత్తికి నిదానమగుచున్నది. ప్రకృతమునకుఁ దెలిసినంతలో గాశ్మీర దేశమునఁ గ్రీస్తుతరువాత తొమ్మిదవ శతాబ్దమందుఁ బ్రసిద్ధికెక్కిన సోమానందునిచేఁ వ్రాయఁబడిన "శివదృష్టి" యను గ్రంథ మగ్రగణ్యము. సోమానందునిచేఁ బ్రారంభింపఁబడిన యీయుద్యమము క్రీస్తుతరువాత పదునెనిమిదవ శతాబ్దియందు లలితా సహస్రనామ వ్యాఖ్యానమును గావించిన భాస్కరునితోఁ బూర్తియయ్యెనని చెప్పవచ్చును. ఈ భాస్కరుడు 1 సేతుబంధము, 2 వరివశ్యా రహస్యము మున్నగు గ్రంథములను బెక్కింటిని రచియించి యున్నాడు. ఈగ్రంథములం దీతఁడు చిత్రించిన చిత్రములకు సోమానందుడు మొదలు భాస్కరుని గురువగు భాసురా నందునివరకును మధ్యం బ్రసరించిన యానందులచే శ్రుతిస్మృతి సదాచార ప్రమాణ విరుద్ధముగఁ బ్రదర్శించిన గ్రంథములే మూలాధారములగుచున్నవి. అట్టి శ్రుతిస్మృతి సదాచార విరుద్ధ విశేషములతోఁ గలుషీకృతమైన దొక యసద్వ్యాఖ్యానముగ నీతఁడు లలితాసహస్రనామ భాష్యమను నొకదానిని చిత్రించియున్నాడు. కావున నీ లలితాసహస్రనామ వ్యాఖ్యానము నిష్ప్రమాణకమును నిర్మూలమును నసంబద్ధవాక్య దీపితమును శ్రుతిస్మృతి సదాచారాను ప్రాణితంబగు శ్రీ విద్యోపాసనంబునకు బాధకంబగుటచే శ్రుతిస్మృతి సదాచారాను ప్రాణితబగు శ్రీవిద్యోపాసనాపరులు ఈ వ్యాఖ్యానాభాసమును హేయమని ద్రోసిపుచ్చి యైహికాముష్మిక నిశ్శ్రేయసంబులను బడయుదురుగాక! ఈ వ్యాఖ్యాతయగు భాస్కరుడు వామాచారగరిష్ఠుడను విషయము ముల్లోకములకుఁ దెలిసిన విషయమే గావున నీతనిచే రచియింపఁబడిన గ్రధముల హేయతనుగూర్చి ప్రత్యేకముగ నిట విమరింప నవసరము లేదు గావున నందుండి యుపరమింపఁబడుచున్నది.

ఏది యెట్లులైనను ప్రకృతమున వ్యవహారమునందు శ్రీ విద్యా శంకర భగవత్పాద ప్రతిష్ఠితంబగు భారతీ సంప్రదాయమునకు విరుద్ధముగ నలరారు శైవ వైష్ణవ శాక్త సంప్రదాయము లన్నియు గాశ్మీర దేశమున నొకప్పుడు ప్రబలియున్న త్రికసంప్రదాయ సిద్ధాంతములనే మూలాధారములుగఁ జేసికొని తమతమ ప్రధాన సిద్ధాంతములను వ్యాపింప జేసినవి. కావున నా యీ కాశ్మీర త్రికవాదమిచట గొంత వరకు విమర్శింపఁ బడుచున్నది.

కాశ్మీర త్రిక సంప్రదాయమునకు మూలము సోమానంద కృతమగు శివదృష్టియను నొక గ్రంథము. ఈ గ్రంథకర్త యగు సోమానందుడు శాలివాహనాష్టమ శతాబ్దియందు (క్రీ. వె. తొమ్మిదవ శతాబ్ది) ఉన్నట్లు తెలియవచ్చెడిని. ఈ సోమానందుని యొక్క సంప్రదాయమును గూర్చియు వంశమును గూర్చియు శివదృష్టి యొక్క యేడవ యాహ్నికమున నిట్లు నిర్వచింపఁబడియున్నది.

శైవాదీని రహస్యాని పూర్వ మాసన్మహాత్మనామ్
ఋషీణాం వక్త్రకుహరే తేష్వేవానుగ్రహక్రియా॥

కలౌ ప్రవృత్తే యాతేషు తేషు దుర్గమగోచరే
కలాపిగ్రామప్రముఖే సముచ్ఛిన్నే చ శివశాసనే॥

కైలాసాద్రౌ భ్రమన్దేవో మూర్త్యా శ్రీకంఠరూపయా
అనుగ్రహాయావతీర్ణశ్చోదయామాస భూతలే॥

మునిం దుర్వాససం నామ భగవానూర్ధ్వరేతసమ్
నోచ్ఛిద్యేత యథా శాస్త్రం రహస్యం కురు తాదృశమ్॥

తతస్స భగవాన్దేవా దేశం ప్రాప్య ప్రయత్నవాన్
ససర్జ మానసం పుత్రం త్ర్యంబకాదిత్యనామకమ్॥

తస్మిన్సంక్రమయామాస రహస్యానిసమస్తతః
సోఽపిగత్వాగుహాంసమ్యక్ త్ర్యంబకాఖ్యాంతతః పరమ్॥

తన్నామ్నా చిహ్నితంతత్రం ససర్జమనసాసుతమ్
ఖమఃత్వపాతసంసిద్ధస్తత్పాత్రోఽపితథాతథా॥

సిద్ధస్తద్వత్సుతోత్పత్త్యా సిద్ధాఏవంచతుర్దశ
యావత్పంచదశఃపుత్రః సర్వశాస్త్రవిశారదః॥

సకదాచిల్లోకయాత్రా మాసీనః ప్రేక్షతేతతః
బహిర్ముఖస్యతస్యాథ బ్రాహ్మణీకాచిదేవహి॥

రూపయౌవనసౌభాగ్య బంధురాసాగతాదృశమ్
దృష్ట్వాతాంలక్షణైర్యుక్తాం యోగ్యాంకన్యామథాత్మనః॥

సధర్మచారిణీం సమ్యగ్గత్వా తత్పితరంస్వయమ్
అర్థయిత్వాబ్రాహ్మణీంతా మానయామాస యత్నతః॥

బ్రాహ్మణేనవివాహేన తతోజాతస్తథావిధః
తేనయః సచకాలేన కాశ్మీరేష్వాగతో భ్రమన్॥

నామ్నాససంగమాదిత్యః వర్షాదిత్యోఽపితత్సుతః
తస్యాప్యభూత్సభగవా నరుణాదిత్యసంజ్ఞకః॥

ఆనందసంజ్ఞకస్తస్మా దుద్బభూవతథావిధః
తస్మాదస్మిన్సముద్భూతః సోమానందాఖ్య ఈదృశః

కరోమిస్మప్రకరణం శివదృష్ట్యభిధానకమ్॥
ఏవమేషాంత్ర్యంబకాఖ్యా తిరంబాదేశభావయా॥
స్థితాశివప్రశిష్యా ద్వైర్విసీర్ణామథితోదితా॥

ఈ సోమానందుని శిష్యుడు, ఉదయాకరునిపుత్రుడును విభ్రమాకరుని తండ్రియునగు నుత్పల దేవుఁడనువాఁడు. ఇతడు సోమానందుని శివదృష్టికి నొక వృత్తిని రచియించెను. ఆ వృత్తియందలి యుపక్రమ శ్లోకము లిట్లు పరగుచున్నవి —

విభ్రమాకరసంజ్ఞేన స్వపుత్రేణాస్మి చోదితః
పన్మాసనందాభిధానేన సబ్రహ్మచారిణా॥
ఈశ్వరప్రత్యభిజ్ఞోక్త విస్తరే గురునిర్మితే
శివదృష్టి ప్రకరణే కరోమిపదసంగతిమ్॥

ఇంతేగాక ఈశ్వర ప్రత్యభిజ్ఞయను నొక స్వతంత్ర గ్రంథమునుకూడ నీ యుత్పలదేవుడు రచియించినాడు. ఏతద్విషయము ఈశ్వర ప్రత్యభిజ్ఞ యొక్క యన్త్యశ్లోకములచే స్పష్టమగుచున్నది, అదెట్లన;-

ఇతిప్రకటితోమయా సుఘట ఏషమార్గోనవో
మహాగురుభిరుచ్యతేస్మ శివదృష్టిశాస్త్రేయథా।
తదత్రనిదధత్పదం భువన కర్తృతామాత్మనో
విభావ్యశివతామయీం మనిశమావిశన్సిధ్యతి ॥ ౧॥

తైస్తైరప్యుపయాచితై రుపనతస్తన్వ్యాఃస్థితోప్యన్తికే
కాన్తోలోకసమానఏవ మపరిజ్ఞాతో నరంతుంయథా
లోకస్యైషతథానవేక్షిత గుణః స్వాత్మాపివిశ్వేశ్వరో
నైవాలం నిజవైభవాయ తదియంతత్ప్రత్యభిజ్ఞోదితా ॥౨॥

ఈశ్వరప్రత్యభిజ్ఞేయ ముత్పలేనోపపాదితా
జనస్యాయత్న సిద్ధ్యర్థ ముదయాకరసూనునా ॥3॥

ఈ యుత్పలదేవుని ప్రశిష్యుడును, లక్ష్మణ గుప్తుని శిష్యుడును అగు నభినవగుప్తుడనునతడు ఈ యీశ్వర ప్రత్యభిజ్ఞయను గ్రంథము

నకు " విమర్శని " యను వ్యాఖ్య నొకదానిని రచించెను. ఈవిష యము:-

శ్రీ త్రైయంబక సద్వంశ మధ్యముక్తామయస్థితేః
శ్రీ సోమానన్దనాథస్య జ్ఞాన ప్రతిబింబకమ్॥

అనుత్తరానన్యసాక్షీ ప్రమథ్యోపాయమభ్యధాత్
ఈశ్వరప్రత్యభిజ్ఞాఖ్యాం యః శాస్త్రం సునిర్మలమ్॥

తత్ప్రశిష్యః కరోమ్యేతాంతత్సూత్రవివృతింలఘుమ్
బుద్ధ్యాఽభినవగుప్తోహం శ్రీమల్లక్ష్మణగుప్తతః॥

అను తద్వ్యాఖ్యాన శ్లోకములవలనఁ దెలియుచున్నది. ఈ యభినవగుప్తుఁడు పెక్కు గ్రంథములను రచించెను. అందుఁ దంత్రాలోకము, తంత్రసారము పరాత్రింశికా వ్యాఖ్య మాలినీ విజయ వార్తికము అను గ్రంథములు ప్రధానములు. ఈ యభినవగుప్తుని శిష్యుఁడు క్షేమరాజనునాతఁడు. ఈతఁడు ప్రత్యభిజ్ఞాహృదయమను నిరువది సూత్రములతో నొప్పు నొక సూత్రగ్రంథమును రచించినాఁడు. ఇదిగాక నీతఁడు స్వచ్ఛంద తంత్రమునకు నొక వ్యాఖ్యానమును శివసూత్రములకు శివసూత్ర విమర్శనియను నొక వ్యాఖ్యానమును రచించెను. ఈతనిచే వాఖ్య గావింపఁబడిన శివసూత్రములు సోమానందునకు బూర్వము కాశ్మీర దేశమున నివసించియుండిన వసుగుప్తునకు శివప్రసాదమువలన లభించినట్లు క్షేమరాజాదులచేఁ దత్తద్వ్యాఖ్యానములందు నిర్వచింపఁబడియున్నది.

" ఇహ..........శివారాధన పరః ...... శ్రీ మహాదేవ గిరౌ మహామహేశ్వరః శ్రీమాన్వసు గుప్తనామా గురురభవత్ ॥ కదాచిదసౌ ... ... 'పరమ శివేనస్వప్నే అనుగృహ్య ఉన్మిషిత ప్రతిభః కృతః యథా " అత్రమహీభృతి మహతి శిలాతలే రహస్య

షుస్తి । తదధిగమ్య అనుగ్రహయోగ్యేషు ప్రకాశయే" తి । ప్రబుద్ధశ్చాసౌ అన్విష్యన్ తాంమహతీం శిలాం కరస్పర్శనమాత్ర పరివర్తనతః సంవాదీకృత స్వప్నం ప్రత్యక్షీకృత్య ఇమాని శివోపనిషత్సంగ్రహరూపాణి శివసూత్రాణి తతః సమాససాద ఏతాని సమ్యగధిగమ్య భట్ట శ్రీకల్లటాద్యేషు సచ్ఛిష్యేషు ప్రకాశితవాన్ స్పందకారికాభిశ్చ సంగృహీతవాన్"

(శివసూత్రవిమర్శనీ)

శ్రీమన్మహాదేవగిరౌ వసుగుప్త గురోఃపురా
సిద్ధాదేశాత్ప్రాదురాసన్ శివసూత్రాణి తస్యహి॥

సరహస్యాన్యతః సోఽపిప్రాదాద్భట్టాయ సూరయే
శ్రీ కల్లటాయ సోప్యేవం చతుః ఖడాంని తాన్యథ॥

వ్యాకరోత్త్రిక మేతేభ్యః స్వసూత్రైః స్వకైస్తతః
తత్త్వార్థ చింతామణ్యాఖ్య యాటీకయా ఖండమంతికమ్॥

(శివసూత్ర వార్తికమ్—3. ౮. ౫.)

ఇట్లు సోమానందుని పరంపరయందలి క్షేమరాజుచే వసుగుప్తునికి సంప్రాప్తమయిన శివసూత్రములును వసుగుప్తునిచే రచింపఁబడిన స్పంద కారికలును ప్రమాణములుగా గ్రహింపఁబడినట్లు సర్వవిధముల దెలియవచ్చుచున్నది. కాని యీ వసుగుప్తుఁడు మాత్రము సోమానందునిచేఁ జేర్కొనఁబడిన త్ర్యంబక పరంపర యందలి వాఁడెంత మాత్రము గాఁడని స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నది. సోమానందుఁడు మొదలుకొని క్షేమరాజు వరకునుగల వారలయొక్క గ్రంథములను బరిశీలించినచో వీరల సిద్ధాంతమునకు, లేక వీరల వాదమునకు, లేక

వీరి మతమునకు బోధకముగ "త్రిక" మను నొక సంజ్ఞాపదమును గ్రహించిరట్లు సువ్యక్తమగుచున్నది. ఈ త్రికశబ్దముచే దమ యభీష్టదేవతా తత్త్వమును నుద్దేశించుచున్నట్లు తెలియుచున్నది. వాస్తవముగా నీ త్రికశబ్దము ద్వైతము, విశిష్టాద్వైతము, అద్వైతము అను నామములవలె నట్టి శిష్టాభిప్రాయమును బోధింపక యెద్దియో యొక తీరున సమయస్ఫూర్తికిఁ దగునట్లు సమన్వయింపఁ జేసికొనుటకుఁ దగు నట్లు సమన్వయింపఁ జేసికొనుటకుఁ దగు నవకాశమిచ్చు కృతికపదమై యలరారుచున్నది. ఈత్రిక శబ్దార్థము—

" నిరాశం సాత్పూర్ణాదహమితి పురా భాసయతియద్ ద్విశాఖామాశాస్తే తదనుచ విభక్తుం నిజకలామ్ । స్వరూపా దున్మేషప్రసరణ నిమేషస్థితి జుషస్ తదద్వైతం వందే పరము శివశక్త్యాత్మ నిఖిలమ్॥

ఈశ్వర ప్రత్యభిజ్ఞా విమర్శినీ. శ్లో. ౧

" నరశక్తి శివాత్మకం త్రికంహృదయే యా వినిధాయ భాసయేత్ । ప్రణమామి పరామనుత్తరాం నిజభాసాం ప్రతిభాచమత్కృతిమ్॥"

పరాత్రింశికా వ్యాఖ్యా. శ్లో. 3

" ఇత్థంప్రసన్న జనతోద్ధరణ ప్రవృత్త శ్రీమన్మహేశ్వర పదాంబుజ చంచరీకః। వృత్తంత్ర్యధాత్ త్రికరహస్య విమర్శగర్భాం కాశ్మీరికా చ్ఛురిలఖాద దిగమ్యజన్మా॥"

పరాత్రింశికా సమాప్తౌ. శ్లో. ౧

ఈత్రికమనునది సర్వోత్తమ రహస్యమనియుఁ దీనికి ప్రవిష్టుఁడు సర్వోత్తముఁడనియుఁ బలువిధముల వీరలు తమ గ్రంథములయందు వర్ణించి కొనియున్నారు;—

పరాత్పరతరతంత్రేకమ్ — "వేదాచ్ఛైవం తతో వామంతతో దక్షం తతః కౌలమ్ । తతో మతం తతశ్చాపి త్రికం సర్వోత్తమంమతమ్॥

" వామమార్గాభిషిక్తోఽపిదైశికః పరతత్త్వవిత్ । సంస్కార్యో భైరవేసోఽపి కులే కాళేత్రికేఽపిసః" ॥శ్రీనిశాచారే॥ "వామమార్గాభిషిక్తోఽపిదైశికః పరతత్త్వవిత్ । క్రమాద్భైరవ తంత్రేషు పునః సంస్కారమర్హతి" ॥శ్రీసర్వాచారే॥

ఈ త్రికరహస్యమునకుఁ బరమ ప్రమాణములుగా వీరలచేఁ గైకొనఁబడిన — 1. మాలినీవిజయము. 2 స్వచ్ఛందతంత్రము. 3. విజ్ఞాన భైరవతంత్రము. 4. ఉచ్ఛుష్మభైరవతంత్రము. 5. ఆనంద భైరవతంత్రము. 6. మృగేంద్ర. 7. మాతంగ. 8. నేత్ర 9. నైష్వాస 10. స్వాయంభువ. 11. రుద్రయామళము అను పదనొకండును ప్రత్యక్షముగ తెలియనచ్చుచున్నవి. వీనిఁబట్టి యూహించినచో వీరలు కాళి యుపాస్య దేవతగా వర్ణింపఁబడిన తంత్రములను ప్రమాణభూతములుగఁ దలచు వామాచారాగ్రగణ్యులుగా నున్నటుల ఉపాసనా సంప్రదాయము దెలిసినవారలకు సువ్యక్తముగఁ దెలియుచున్నది. ఈ త్రిక సంప్రదాయమున దీక్ష నొందినవారలకు వర్ణాశ్రమాది భేదము గాని, భక్ష్యాభక్ష్య నియమముగాని యింకను శ్రుతిస్మృతి ప్రమాణ సిద్ధవర్ణాశ్రమ ధర్మముల సంబంధముగాని యించుకేనియు నవసరము లేదనియు వీరలందఱుఁ బై నియమముల కతీతులనియు స్పష్టముగ వీరి గ్రంథములఁబట్టి దెలియుచున్నది. ఏతద్విషయమున నభినవగుప్తాదితముల నిటుఁ బ్రదర్శించుచున్నారము—

" సేయం యదా ఘటితి విగలితా భవతి తదానిరస్తపాశో వయం త్రిశాకలంకో భైరవవ్యాపయానుప్రవిష్టో భవతీతి సర్వదా ఏతదభ్యాసే యతితవ్యమ్ । శ్రీతిలకశాస్త్రేఽయంభావః । శ్రీభర్గశిఖాయామప్యుక్తమ్ — "వీరవ్రతంచాభినందేద్యథా యోగంతథాభక్ష్

సేత్" ఇత్యాది శ్రీసర్వాచా ర్యేపి.

అజ్ఞానాచ్ఛంకతేమూఢః తతః సృష్టిశ్చసంహృతిః
మంత్రవర్ణాత్మకాస్సర్వే వర్ణాశ్శివాత్మకాః॥
పేయాపేయంస్మృతో ఆపః భక్ష్యాభక్ష్యంత పార్థివమ్
సురూపంచ విరూపంచ తత్సర్వం తేజఉచ్యతే
నైవేద్యంచ నివేదీచ నైవేద్యం గృహ్యతేచయత్
సర్వంపంచాత్మకం దేవి నతేనరహితంక్వచిత్
ఇచ్ఛాముత్పాదయేదాత్మ కథంశం కావిధీయతే॥

ఇతి వీరావళిశాస్త్రే ప్యయమేవాభిప్రాయ ః। ఉక్తంచ-క్రమ స్తోత్రే—

" సర్వార్థ సంక్రమణ సంయమస్య
యమస్య జన్తుర్జగతో యమాయ"

వపుర్మహాగ్రాస విలాసరక్తం సంకర్షయన్తీం ప్రణమామికాలీమ్ ఇతి వ్యాఖ్యాతం చైతన్మయా తట్టీకాయా మేవక్రమకేలా విస్తరతః। అత ఏవ షడర్ధశాస్త్రే ష్వేషైవక్రియా ప్రాయోపాయనత్రిణా రహిత త్వేనపూజా। తత్పరిపూరణాయైవ సర్వదివ్యాలాభాత్ సంవత్సర మధ్యే చతుః త్రిర్ద్విః సకృతీవా పవిత్రకవిభిరుక్తః। క్రియాయాః పూరణార్థాయ యాగాజ్ఞా పూరణాయచ। చతుః సకృద్వాయః కుర్యా న్నవవిత్రం సనిష్ఫలః॥ ఇతి,

విజ్ఞానక్రమః విస్తరతఉక్తః। జాతీనాంచ బ్రాహ్మణాదీనాం నాస్తి స్థితిః। కల్పితత్వాత్। ఉపదేశే వ్యంగ్యతేతితు దుర్బుద్ధీ న్సహా న్ప్రత్యాయయేత్। ఇతిచ భగవతాముకుట సంహితాయాం విస్తరతో నిర్ణీతమ్। ఇహతు అయత్న సిద్ధమేవ"

(పరాత్రింశికా వ్యాఖ్యాయాం యాగవిషయే)

ఇట్లే తంత్రసారమునందు —

" తత్రపరమేశ్వరః పూర్ణసంవిత్స్వభావః। పూర్ణతైవాస్య శక్తిః కులం సామర్థ్యం । ఊర్మిః హృదయం సారం స్పన్దః విభూతిః త్రీశికా కాళీ కర్షణీ చండీవాణీ భోగో దృక్ నిత్యా ఇత్యాదిభిః ఆగమభాషాభిస్తత్తదన్వర్థప్రవృత్తాభిః అభిధీయతే। తేన తేన రూపేణ ధ్యాయినాం హృద్యాస్తామితి చక్రేశస్య స్వాతంత్ర్యం పూర్ణత్వం శ్రీకాలీశబ్ద వాచ్యాః । కలనం చ గతిః క్షేపో జ్ఞానం గణనం భోగీకరణం శబ్దనం స్వాత్మలయీకరణం చ। యథాహుః శ్రీభూతిరాజగురవః "

" క్షేపాద్ జ్ఞానాచ్చ కాలీ కలనవశతయాఽథ " ఇతి.

ఏషచార్థః తత్రతత్ర మయా ప్రబంధే వివేచితః ప్రకరణస్తోత్రాదౌ వితత్య వీక్ష్యః । నాతిరహస్యమేకత్ర స్థాప్యం । న చ సర్వథా గోప్యమితి అస్మద్గురవః। ఏవం విధే యాగాదౌ యాగాన్తే చ పంచకే ప్రత్యేకం బహుప్రకారం నిరూఢిః యథా యథా భవతి తథైవాచరేత్। న తు భక్ష్యాభక్ష్య శుద్ధ్యశుద్ధ్యాది వివేచనయా వస్తుధర్మోజ్ఝితయా కల్పనామాత్రసారయా స్వాత్మా ఖేదనీయ ఇత్యుక్తం పూర్వాచార్యైః న హి శుద్ధిః వస్తురూపం నీలత్వవత్ । అన్యత్ర తత్త్వైవా శుద్ధిచోదనాత్ । ప్రాసద్యే వదీక్షితత్వే । చోదనాతస్తస్య తత్రత్యా శుద్ధమితిచేత్ చోదనాన్తరేపితుల్యం । చోదనాన్తరమసతీ తద్బాధితత్వాదిచేత్ న శివచోదనాయా ఏవ బాధకత్వం యుక్తిసిద్ధం సర్వజ్ఞోత్తరాద్యనన్తాగమసిద్ధంచ ఇతి వక్ష్యామః । తస్మాత్ వైదికాత్ప్రభృతి పారమేశ్వర సిద్ధాన్త తంత్రకులోచ్ఛుష్మాది శాస్త్రోక్తోపి యో నియమో విధిర్వా నిషేధో వా సోఽత్ర యావదపవిత్రత ఏవ ఇతి సిద్ధమ్ తథైవచోక్తం శ్రీపూర్వాదౌ ఏతత్త్వ తంత్రాలోకాదన్వేష్యమ్ (తంత్రసారే షట్త్రింశ పాతవటలే)

మాలినీ స్వరూపము, కాలినీ స్వరూపమే యని యభినవగుప్తులిట్లు నిర్వచించియున్నాడు:-

"మాలినీ హి భగవతీ ముఖ్యం శాక్తం రూపం బీజయోని సంఘట్టేన సమస్త కామదుఘమ్॥ అస్యార్థం చైతన్యానురుద్ధశక్తి మాలాభిర్వ్యక్తాఘరేషు ప్రతిష్ఠితా సంసార కీర్తిసంహారనాద భ్రమణసిద్ధి మోక్షధారిణీ దానాదాన శక్తియుక్తా ఇతి రలయోరైకత్వస్మృతేః"

ఇక స్వచ్ఛంద తంత్రమున నైవేద్య ప్రస్తావమున —

"పరాన్నం యాపబాభావ్య నైవేద్యాని నివేదయేత్" ... ...

... ... ... ... ... ...

రసాలాంచ దధిక్షీరమాసవం వివిధంతథా
మత్స్యమాంసాన్యనేకాని పేహ్యాపేయానియానిచ
అగ్రమాపూరయేచ్ఛంభో ర్విత్తశాఠ్యవివర్జితః
పశ్చాదర్ఘః ప్రదాతవ్యః సురయాసుగంధయా॥

(స్వచ్ఛందతంత్రే ద్వితీయపటలే)

తద్వ్యాఖ్యానే:- "సురాయా ఆనంద హేతుత్వాద్దేవముక్తయే హేతుజాత్యద్వార పరభైరవరూపత్వ స్మిలకేఽప్యస్మిన్ భైరవనయే సురా శబ్దం జలవాచినమపి వ్యాచక్షతే తేజో త్రిగ్రహగ్రస్తాః"। "మద్యం మాంసం తథామత్స్యా నన్యానిచనరాననే। సాచారాంశ్చ నిరాచారాం ల్లింగినోనజుగుప్సయేత్" ఇతి భాషిసమయోల్లంఘిన పశవవవ॥ అని.

ఈ త్రిక సమయ దీక్షితులకు వర్ణాశ్రమాచార సత్సంప్రదాయములతో నెంతమాత్రము పని లేదనియు సవారలకు నయ్యది యత్యంత

హేయములేయనియూ - స్వచ్ఛన్ద తంత్రము చతుర్థ పటలాన్తమున నిట్లు చెప్పఁబడియున్నది.

తథా నానాశరీరాణి భువనాని తథాతథా
విసృజ్యరూపం గృహ్ణాతిప్రోత్కృష్టాధమ మధ్యమమ్
స్థానానురూపతో దేహాన్ దేహా కారేణభావనా॥
ఆదదత్తేన తేనైవ రూపేణ ప్రవిభావ్యతే
క్రీడయా దుఃఖవేద్యాని కర్మకారీణి తత్స్థలైః
సంభక్ష్యమాణాని తథా నరకార్ణవ గహ్వరే
నివాసీని శరీరాణి గృహ్ణాతి పరమేశ్వరః॥

ఏవం సర్వపదార్థానాం సమైవ శివతాస్థితా
పరాపరాదిభేదోఽత్ర శ్రద్ధానైరుదాహృతః
ఏవం భేదాత్మకం నిత్యం శివతత్త్వ మనన్తకమ్
తథాతస్య వ్యవస్థానా న్నానారూపేపి సత్యతా॥

ఈ శాస్త్రమును త్రికశాస్త్రమనియు, నీ సంప్రదాయమును త్రికసంప్రదాయమనియుఁ జెప్పుటకు హేతువును మాలినీ వార్తికమున నభినవగుప్తుఁడిట్లు చెప్పినాఁడు—

ఇత్థం తంత్రం రుద్రశివభైరవాఖ్యం స్థితంత్రిధా
వస్తుతో హి త్రికైవేయం జ్ఞానశక్తి ర్విజృంభతే
భేదేన భేదాభేదేన తథాచా భేదసంధినా
తథాచ ముఖ్యాశ్శంభవ్యః తిస్ర ఇచ్ఛాది శక్తయః
తత్త్రైవతు ప్రపంచేన పంచశక్త్యాది యోజనమ్
ఇత్థం మధ్యేవిభిన్నం తత్త్రికమేవపరంతథా
శాస్త్ర మస్మద్గురుగృహే సంప్రదాయ క్రమాత్ స్థితమ్॥

అభినవగుప్తుఁడు తన కాలమున నున్న మతముల నన్నింటిని నుదాహరించుచు నవ్వానిలో దేనితోడను దన వాదమునకు సంబంధము లేదని యిట్లు మాలినీ వార్త్తికమునఁ జెప్పెను --

వేదసాంఖ్య భవేద్యాదన్యాయసౌగత శాక్తికైః
పంచరాత్ర క్రియాశాస్త్ర సిద్ధాన్తాది భిరవ్యలమ్॥

యన్నసాంఖ్యై ర్నయోగీంద్రై ర్నప్రియేపాంచ రాత్రికైః
ఇత్యాది యావదాక్షిప్తం వాదినాంతు శతత్రయం
త్రిషష్ట్యా చాధికం తేహి తావన్మాత్ర వివేచకాః॥

ఈ త్రికము అద్వైత తత్త్వ ప్రతిపాదకమని పలువిధముల మాలినీ వార్త్తికమున నిర్వచింపఁబడియున్నది--

భగవద్యోగ మద్వైతం నిర్ద్వంద్వంచ ప్రచక్షతే
తస్యోపదేశఇత్థం స్యాద్యద్వదియావ ద్విభేదవత్॥

సంభావ్యతే తన్నిర్భక్త్యా నిర్భక్త్యైవ నిరూప్యతే
అద్వైత భైరవ విభౌయత్ప్రివేశోపవేశయోః॥

వీరి యభిప్రాయము నద్వైతమనఁగా న్యాయవైశేషిక సాంఖ్య యోగ పంచరాత్రాది తంత్రముల ననుసరించెడి మతములని యభిప్రాయము. అట్టి మతముల నిరాకరణము ముందిడుకొని తన మతమును నిరూపించుచున్నటుల మాలినీ వార్త్తికమున నభినవగుప్తుఁ డిట్లు ప్రశంసించియున్నాడు-

అతస్సంభావ్య నిఖిలద్వైత శంకావ్యపోహనే
గురూణాంచ శిష్యాణాంచ యత్నైః సర్వైర్వి జృంభతే
అత్రాద్వైత మహాశంక్యా శంక్య సర్వం ప్రతన్యతే॥

తన యద్వైతమునకుఁ బ్రమాణము భట్టనారాయణస్తోత్రమని యందలి వాక్యములు స్వీయవ్యాఖ్యానముతోఁగూడ నుదాహరించి యున్నాఁడు—

తథాహి శ్రీమత్స్తోత్రే భట్టనారాయణేనతత్
నమస్తే భవసంభ్రాన్త భ్రాంతిముద్భావ్య భిందతే
జ్ఞానానందంచ నిర్ద్వంద్వం దేవవృత్వా వివృణ్వతే
నిర్ద్వంద్వ మితి నిర్ద్వైతం ప్రకటీ క్రియతే పదమ్॥

వీరలచే అద్వైతమని చెప్పఁబడు నది శ్రుతిస్మృతి సదాచార క్రమప్రాప్తమగు భారతీ సంప్రదాయముచేఁ బ్రవర్తింపఁ జేయఁబడు ప్రస్థానత్రియ ప్రమితాద్వైత మెంతమాత్రము గాక శ్రుతిస్మృతి సదాచార ప్రమాణానుయాయులను భ్రమింపఁ జేయుటకుఁగాను భట్టనారాయణాదులచే నెద్దియో యొకతీరున నద్వైతమని ప్రతారణము చేయఁబడినదే గాని వాస్తవమగు నద్వైత మియ్యది యెంతమాత్రము గాదు. యథార్థముగా వీరి మతము త్రికము లేక త్రికవాదము లేక త్రికరహస్యమని యెన్నఁదగియున్నది. ఏల యనఁగాఁ బ్రస్థానత్రయ ప్రమితమగు నద్వైత సిద్ధాన్త మనఁగా బ్రహ్మము సజాతీయ విజాతీయ స్వగతభేద శూన్యమగు సచ్చిదానంద రూపమనియుఁ బరిదృశ్యమానమగు జగజ్జీవేశ్వర భేదముతో నొప్పు జగమంతయు రజ్జుసర్పమట్లు మిథ్యారూపమనియును, ఇఁక త్రికవాదులచే నంగీకరింపఁబడు పరశివరూపము శివశక్తి సామరస్య రూపమగుటవే యామలమనియు పరశక్తి శివాత్మక మగుటచేఁ ద్రికమనియు సర్వవిధముల గ్రంథములం దుద్ఘోషింపఁబడుచునేయున్నది. ఇట్టి స్వరూపమునకు సజాతీయ విజాతీయ భేదములు లేవని యెద్దియో యొకతీరున। దలంపఁబడినను స్వగతభేదరూపమగు దోషమును వారించుట కెంతమాత్రము నవకాశము లేమింజేసి యియ్యది ప్రస్థానత్రయ ప్రమితాద్వైతమని యనుట కెంతమాత్రము వలనుపడదు. వేయేల ! ఈ త్రికవాదులయొక్క ప్రయత్నమం

తలయు యోగదర్శనముచే నుద్ఘోషింపఁబడు ద్వైతమునకును బ్రస్థానత్రయ
ప్రమితమగు నద్వైతమునకును నొక యాంతరసంబంధమునో యంతరా
ళవాదము నొకదానిని లేవందీయుటయే ముఖ్య తాత్పర్యముగఁ గల్గి
యున్నదనుటకు సందేహము లేదుగదా! అట్టిప్రయత్నము సోమానంద
ప్రణీతమగు శివదృష్టియందలి తృతీయాహ్నికమునందు సువ్యక్తమే.—

ఆధశక్తేః పరావస్థాయై ర్భక్త్యా పరిగీయతే
యుక్త్యా ప్రకాశితో దేవస్తతః శక్తి దశాయుతః॥

తథా తద్వ్యపదేశశ్చ వ్యపదేశః శివాత్మకః
న శివఃశక్తి రహితో న శక్తి ర్వ్యతిరేకిణీ॥

శివఃశక్తి స్తథాభావా నిచ్ఛయా కర్తుమీహతే
శక్తిశక్తిమతో ర్భేదః శైవే జాతు నవర్ణ్యతే॥

తస్మాత్సమగ్రా కాలేషు పర్యాసు ప్రతిపత్తిషు
విజ్ఞేయం శివరూపత్వం స్వశక్త్యావేశనాత్మకమ్॥

ఇట్టి సిద్ధాంతము ననువదించుటకు సోమానందునిచే నీయబడిన ప్రమాణపురుషులు;—

తథాబాహ ఖేటపాలః శబ్దరాశే ర్విశేషతామ్
స్వాయంభువస్యటీకాయాం బాధమిత్యాదినాగురుః
తథామతంగటీకాయాం వ్యాఖ్యాని గురుణోదితమ్॥

ఈ త్రికవాదము పాతంజలయోగ సిద్ధాన్త విలక్షణమను పర
మత ఖండనము నిట్లు సోమానందుఁ డుపసంహరించెను.

పాతంజాలాదీశ్వరేణ వసామ్య మవిభేదతః
ఇహాత ద్విన్న విజ్ఞేయం తస్మాత్సర్వం స్థితః శివః॥

ఇట్టి నీ త్రికసిద్ధాన్తమున నిర్వచింపఁబడిన శివస్వరూపము యోగోక్త పురుష ప్రకృతీశ్వరత్రితయతత్త్వములను గ్రంథిగాఁ జేసిన పరశక్తి శివరూపమేయనియు నట్టిస్వరూపము శివునికి నిరూపించుటకే శివదృష్టి యను గ్రంథము సోమానందునిచే రచియింపఁబడినట్లు కోవిదులు సుకరముగ గ్రహింపగల్గుదురు. ఈ యభిప్రాయమును శివదృష్టిలోనొక్క

ఏవం భేదాత్మకం నిత్యం శివతత్త్వ మనంతకమ్
తథాతస్య ప్రతిష్ఠానా న్నానారూపేపి సత్యతా॥

ఇతికథితమశేషం శైవరూపేణ విశ్వం, జగదుదిత మహేశాం
ప్రత్యభిజ్ఞయాస్వప్న భాజా। యదధిగమబలేన ప్రాప్య సమ్యగ్వికాసం,
భవతి శివ మయాత్మా సర్వభావేన సర్వః॥

అనుశ్లోకములఁబట్టి స్పష్టమగుచున్నది.

ఇంత వరకు సోమానందునితోఁ బ్రారంభించిన త్రికసంప్రదాయముయొక్క విశేషము క్షేమరాజువలనఁ దెలియవచ్చిన సంప్రదాయస్థుల గ్రంథముల మూలముగ నిర్వచింపఁబడియె.

ఈ క్షేమరాజునుతఁడు, అభినవగుప్త శిష్యుఁడు, అభినవగుప్తుడన్నచో శాలివాహన దశమశతారంభమున (క్రీ. శ. 11) ఉన్నటుల దెలియ వచ్చుచున్నది. దానజేసి క్షేమరాజు శాలివాహన దశమశతాన్తమునగాని, పదునొకండవ శతారంభమునఁగాని యుండెనని నిశ్చయింపఁబడుచున్నది. త్రికసంప్రదాయ గ్రంథముల విచారించినచో నందుఁ బ్రస్తుతము రామానుజ మతానుయాయులచే గౌరవముగా

వ్యవహరించుకొనఁబడు 'విశిష్టాద్వైత' నామ మించుకేనియుఁ గానఁ
బడదు, ద్వైత మను పేరు త్రికవాద గ్రంథములందుఁ దెలియ వచ్చు
చున్నను అట్టి ద్వైతశబ్దముచేఁ బ్రకృతమునఁ గల 'మధ్వ' మెంతమా
త్రము నచటఁ గానఁబడదు. కాని ప్రకృతమున ద్వైతమునాఁబడు మధ్వ
మతమునకును విశిష్టాద్వైతమను రామానుజ మతమునకునుఁ బాంచ
రాత్రమను పేర నొకింతగతి యున్నట్లు కానవచ్చుచున్నది. రామాను
జుం డన్నచో శాలి. 1054 (క్రీ. శ. 1132) వత్సరమునఁ గాలమునొం
దెను. దానం జేసి రామానుజుఁడు అభినవగుప్త శిష్యుఁడగు క్షేమరాజు
నకును దచ్ఛిష్యులకును సమకాలికుఁడైయున్నట్లు నిశ్చయముగఁ దెలిసి
కొనవచ్చును. ఈ రామానుజుఁడు క్షేమరాజాదులవలన నీ త్రికవా
దమును నెద్దియో యొకతీరున సంగ్రహించి వారలు శివునకుఁ జెప్ప
త్రికరూపమును దన విష్ణువునకు నంటించి యద్దానికిఁ జిదచిత్స్వరూపము
నుగల్పించి శివాద్వైతమని వారలు వ్యవహరించుచుండఁ దాను దనమత
మును విష్ణ్వద్వైతమని వ్యవహరించినఁ దన సంగ్రహణము (కైంక
ర్యము) బయల్పడునను భీతితోఁ దన మతమునకు 'విశిష్టాద్వైత' మను
నొక నామమును బెట్టెను. అయితే నీ రామానుజునియందొక విశే
షము గలదు. త్రికవాదులన్ననో తమ యభీష్ట తంత్రములకు ననువగు
నట్లు స్వతంత్రముగాఁ ద్రికవాదమును సాంఖ్యయోగ తంత్రములనుండి
యుద్ధరించియున్నారు. రామానుజుఁడన్నచో త్రికవాదులనుండి సంగ్ర
హించిన వాదముచే నుపనిషత్ప్రతారణము గావించుచు బ్రహ్మసూత్ర
ములకు నొక వ్యాఖ్యాడంబరమును గావించి యున్నాఁడు. ఇయ్యది
కడుంగడు సాహసముగదా! ఇఁక మధ్వయన్ననో 'బ్రహ్మశబ్దశ్చ విష్ణా
వేవ' యను వార్త్తికము నొకదానిని గల్పించి బ్రహ్మసూత్రములకు
నొక వృత్త్యాభాసమును బ్రకటించి తన మతము ద్వైతమని ప్రకటించు
కొనెను. ఏది యెట్లైనను బ్రకృతమునఁ దెలియవచ్చెడి ద్వైత విశి
ష్టాద్వైతములు రెండును బాంచరాత్ర మత నిరాకరణముచే నాత్రిక
వాదులచే నిరాకరింపఁబడినవి. ఇది యిట్లుండ శాలివాహన శకము

17. శతా॥ అప్పయ్య దీక్షితుని కాలమున నుండెడి శ్రీకంఠశివాచారి యను నాతఁడు రామానుజు ననుకరించుచుఁ జోళ దేశమునందు బ్రహ్మ సూత్రములకుఁ బరశివపరముగ నొక వ్యాఖ్యానాభాసమును రచియించియుండెను. చోళరాజు సమ్మానముచే నప్పయదీక్షితుఁడు ఇద్దానికి వ్యాఖ్యానము రచించెను. వేయేల! పాంచరాత్రిమతము వేదవ్యాస మహర్షిచే బ్రహ్మసూత్రములందలి ద్వితీయ పాదమునందలి చివరి యధికరణమున సర్వవిధములఁ ద్రోసివేయఁబడి యున్నది. ఇయ్యది ప్రసంగాను ప్రసంగముచేఁ జెప్పఁబడియె. ప్రకృతము ననుకరింతము—

కాశ్మీరదేశమున నొకానొకప్పుడు విజృంభించిన యీ త్రికవాదము శివాద్వైతమని పలువురచేఁ బలువిధముల భాషింపఁబడుచున్నను నయ్యది శైవముగాదు, అద్వైతమునుగాదు. ఇఁక నేమనఁగా నయ్యది వాస్తవముచే వామాచారపూరితమును ఘోరమునగు శాక్తేయము. అద్దానిని అచ్ఛాదించుటకు శైవదృష్టి యనునది యొక పూఁతదక్క వేరొండుగాదు. ఇట్టి శాక్తేయము ప్రకృతమునఁ గాశ్మీర దేశమున రూపుమాసినను వంగదేశమున నచ్చటచ్చట మేకవన్నెపులివలెఁ గొంతవఱకు నేఁటికిని వ్యవహారము గనుచున్నది. కాని యద్దానిని నిర్వహించు ప్రముఖులు లేకపోవుటచే నద్దాని ప్రచారము లోకవిస్తృతి నంతగాఁ గనియుండలేదు. ఇది యిట్లుండ నీ త్రికసంప్రదాయమునకుఁ జెందిన మందశాక్తేయము మాత్రము మహారాష్ట్రదేశమునందుఁ గొంతకాలమువరకు విజృంభించి యయ్యది యభినవగుప్తునితోఁ దుల్యుఁడగు ప్రవర్తకుని భాస్కర రూపమును గనినది. ఈభాస్కరుఁడు తనకాలము నతని గ్రంథమున నిట్లు జెప్పుకొనియెను.

శ్రీ విశ్వామిత్రవంశః శివభజన పరోభారతీసోమపీథీ
కాశ్యాం గంభీరరాజో బుధమణి రభవద్భాస్కరస్తస్యసూనుః
మోదచ్ఛాయామితాయాం శరది శరదృతావాశ్వినేకాలయుక్తే

శుక్లే సౌమ్యే నవమ్యాం మతనుత లలితానామ సాహస్రభా
ష్యమ్॥

దీనినిబట్టి భాస్కరుడు శాలి శకమున 1685 కాలయుక్తి వత్సర ఆశ్వయుజ శుద్ధ నవమీ బుధవాసరమునఁ దన గ్రంథమును ముగించినట్లు స్పష్టము—

కావున నతడు శాలి 1685 వత్సరమున నున్నట్లు దెలియుచున్నదిగాదా! ఇక సేతుబంధమున „ శివరాత్రౌ శకేశర్మచాష్టే" యని వ్రాసికొనియున్నాడు. దీనింబట్టి యీతడు శాలిశకము 1655 సంవత్సరమున నున్నట్లు దెలివచ్చుచున్నది. దానంజేసి యీతడు శాలిశకము 17వ శతాబ్దమున నున్నటుల సుస్పష్టము.

ఈతడు శ్రీ లలితో పాసనమును వామాచారసరణి ననుసరించి యాచరించినట్లు సర్వలోక విదితమగు విషయము. ఈతని యాచారమునకు మూలప్రమాణములు జ్ఞానార్ణవ తంత్రము, కులార్ణవతంత్రము పరశురామ సూత్రము తద్వ్యాఖ్యయగు నిత్యోత్సవము. ఈతడు కాశ్మీరదేశీయ త్రికవాద గ్రంధజాలము నంతను నామూలాగ్రముగ బఠించి తదనుగుణముగ బెక్కు గ్రంథములకు వ్యాఖ్యానా భాసముల చేసి శ్రుతిస్మృతి సదాచారసిద్ధమగు భారతీ సంప్రదాయమునకు ముప్పును గల్పించినాడు. కావున నీతని విషయ మొకింత విపులముగ జర్చింపబడవలయును—

ప్రకృతకాలమున స్మార్త బ్రాహ్మణుల యందు వామాచార ప్రయుక్తమగు త్రిపురసుందర్యుపాసనము ప్రచ్ఛన్నమై గొంతవరకు విపులప్రచారమును గల్గియున్నది. ఇట్టి ప్రచారమునకు నిదానము భాస్కరుని గ్రంథాడంబరమే యని నొక్కి చెప్పవచ్చును. వీరలు ఇంచుమించుగా భాస్కరునిచే చేయబడిన సేతుబంధము, లలితా

సహస్రవ్యాఖ్యయగు సౌభాగ్య భాస్కరము వరివస్యా రహస్యమను మూడుగ్రంథములను బ్రధాన ప్రమాణపదవియందు నిడుకొని సిద్ధోక్త్సవ ప్రయోగమును సర్వవిధముల ఉపాదేయముగ గ్రహించుచు వ్యవహరించుచున్నారు. కావున బకృతపు బ్రచ్ఛన్నా ప్రచ్ఛన్న వామాచారులకు హితముగరుప భాస్కరుని ప్రామాణ్యవాదము ఇచట బ్రథమమున నిరాకరింపబడు చున్నది. భాస్కరుని ప్రామాణ్యవాద పటుత్వమంతయు నాతనిచే వామకేశ్వర తంత్రమునకు వ్రాయబడిన సేతుబంధమనెడి వ్యాఖ్యయందు సుస్పష్టముగ దెలియవచ్చుచున్నది. కావున అయ్యది ఇచట పొందుపరచి విమర్శింపబడుచున్నది. సేతు బంధమున గాళ ప్రామాణ్య మిట్లు చెప్పబడియున్నది.

శైవవైష్ణవ దౌర్గార్క గాణపత్యాదికైః క్రమాత్
మంత్రైర్విశుద్ధచిత్తస్య కౌలజ్ఞానం ప్రకాశతే॥

సర్వేభ్యశ్చోత్తమా వేదా వేదేభ్యో వైష్ణవంపరమ్
వైష్ణవాదుత్తమం శైవం శైవాద్దక్షిణముత్తమమ్

దక్షిణాదుత్తమంవామం వామాత్సిద్ధాన్తముత్తమమ్
సిద్ధాన్తాదుత్తమం కౌలం కౌలాత్పరతరంనహి॥

ఇందు సాధారణ ప్రమాణములలో వేదములు ఉత్తమములనియు నవ్వానికంటె వైష్ణవ ముత్తమప్రమాణమనియు నద్దానికంటె శైవమును, అద్దానికంటె దక్షిణమును, దానికంటె సిద్ధాన్తమును, నాసిద్ధాన్తముకంటె కౌళమును ఉత్తరోత్తర ప్రామాణ్యము నొందుచున్నవనియు జెప్పబడియె, దీనినిబట్టి వేదము సకలప్రమాణములలో నత్యన్త దుర్బల ప్రమాణమేయని వీరి మతమైనట్లు సుస్పష్టము.

ఇచ్చట గౌళమునుగూర్చి వామకేశ్వర తంత్రమున నిటుల నిర్వచింప బడియె

ఏవంకృత్వా జపందేవ్యా వామహస్తే నివేదయేత్
అనామాంగుష్ఠయోగేన తర్పయేచ్చక్రదేవతాః

త్స్యం, సం, థా, ద్యం. మ, మాం, త, మ, దేవ్యైతువి
నివేదయేత్

కౌలాచార సుసంయుక్తైర్వీరైస్తు సహపూజయేత్ ॥

గుహ్యాతిగుహ్య గోప్త్రీత్వమితి మన్త్రార్థాను సంధానపూర్వకం జలప్రక్షేపో జపనివేదనమ్। తదుద్దిశ్యాధికరణవిధిః। తర్పణోద్దేశేన తత్త్వముద్రావిధిః। నివేదనోద్దేశేన వ్యాకులాక్షరపాఠేచ ప్రథమాదిత్రయ విధిరితరోపలక్షణమ్। పాదుకాచార సమయాచారోభయ పరవీర సాహిత్యవిధినా కౌలాచార పరిభ్రష్ట సాహిత్య పరిసంఖ్యా"

ఈ కౌలాచారమునకు మద్యపాన ముత్తమోత్తమ ధర్మమనియు మద్యము యాగద్రవ్యములలో నుత్తమోత్తమ ద్రవ్యముగను నున్నటుల ఈ ప్రకరణముననే చెప్పబడియెను.

"శాస్త్రోపసంహారం నాన్తరీయకత యాంధ్వనయన్న నధీయా నందండయతి—

అజ్ఞాత్వాతు కులాచారా మయష్ట్వా గురుపాదుకామ్
యోఽస్మిన్ శాస్త్రే ప్రవర్తేత తంత్వం పీడయసే ధ్రువమ్
ఏవజ్ఞాత్వా వరారోహే కౌలాచార పరః స్సదా
అవమోక్ష్య బలాకారం యేచ్ఛవేన్యం దతనిమత్వాత్పరిథా

ప్రసరాకారాస్య యోవపరిభావయేత్
త్వామిచ్ఛానివిగ్రహాం దేవీం గురురూపాం విభావయేత్
శేషం గురోర్ని వేద్యాపి పశ్చాదాత్మ నియోజయేత్ ।

కల్పనామాత్రే వ్యవహార దేశ సాత్మ్యేత్యా రభ్యావ రేచ శాస్త్రా నుశిష్టా ఇత్యన్తే నగ్రంథేనోక్త ఆచారః కులాచారః"

పై మద్య పానముతోపాటు మాంసభక్షణముకూడ నత్యంతా వశ్యకమైయున్నటుల—

దన్ద్వం మ, బస. ఖా, న్మ, వ, పి, స్వేచ్ఛాచార పరః స్వయమ్

అహంతే దంతయోరైక్యం భావయ న్విరహేత్సుఖమ్॥

వ్యాకులాక్షరోఽత్ర ప్రథమశ్చరణః। పూజాబహిః శాలేప్యస వరతం స్వస్యజగతశ్చా భేదం విభావయన్నేవ లౌకిక వైదిక వ్యవహా రేషు సంసరేత్ । తేన బాహ్యాసంతాపానాక్రియణాత్సుఖైక రూప ఏవ అవతిష్ఠతే" అని చెప్పబడియెను. ఈ ప్రకరణమున మద్యమాంస భక్షణబోధకములగు శ్లోకములు వ్యాకులాక్షరములతో జిత్రింపబడుట గ్రంథోపదేష్టయగు భైరవుని యుపదేశ వైశిష్ట్యమునకా లేక వ్యాఖ్యా తయొక్క ప్రతారణార్థమా యనునది యొక ప్రధాన విచారణీయాం శము. ఇయ్యది యుపదేష్టయొక్క యుపదేశ రచనావిశేషమని నిర్ణ యింప నవకాశములేదు. ఏల యనగా ఈ భైరవుని చేతనే యుపదేశిం పబడిన స్వచ్ఛందాది తంత్రములందు మద్యమాంసాది శబ్దములు క్రమ వర్ణాత్మకముగానే యుపదేశింపబడినవి. స్వచ్ఛందాది తంత్రములందు సక్రమనిర్దేశముతో నావదముల నునుపదేశించిన భైరవుడు ఈవామకేశ తంత్రమునందీ యపభ్రంశ శ్లోకమును ఉచ్చరింపగల కారణమేమి ? పవిత్రములుగా దలంచబడు ద్రవ్యములను దెల్పుపదములను నుచ్చరిం

ఘట యసంగతము కాని చో నాపదములను క్రమవర్ణను లతో సుచ్చ
రింప వెరచుటకుగల కారణ మేమి? భైరవుడట్లు భయ పడుటకుగల కార
ణము దెలియరాదు. కావున నీ వ్యాకులాక్షర ప్రతారణము వ్యాఖ్యాత
యొక్క ప్రకరణమని తెలియుచున్నది. భైరవోపదేశ మొక రీతిగా
నొప్పుచుండ వ్యాఖ్యాత నిట్టి ప్రతారణమున కేటుల సాహసించెను?
అందుగల విశేష మెద్దియేని యున్నచో నయ్యది ప్రాజ్ఞులే యూహిం
త్రుగాక! ఏది యెటులైనను గౌళాచారము అనగా మద్యమాంస భక్ష
ణమును సర్వవిధముల నొనరించుటయే యనియు నయ్యది యుత్తమో
త్తమ ధర్మమనియుగదా పై "శైవవైష్ణవ...... కౌలాత్పరతరం నహి"
యను చాటుశ్లోకములవలన దెలియుచున్నది! పై శ్లోకములు ఎందుండి
వ్యాఖ్యాతచే గ్రహింపబడినవో తెలియరాదు. ఈ చాటువులే ప్రమా
ణమని తలచినచో నీ కౌలమును ద్రోసిపుచ్చి త్రికాతిశయమును బో
ధించు చాటు శ్లోకములగూర్చి యేమి చెప్పవలయును? చూడుడు—

వేదాచ్ఛైవంతతో వామంతతో దక్షం తతః కులమ్
తతోమతంత తశ్చాపిత్రికం సర్వోత్తమం మతమ్॥

ఈ చాటు శ్లోకమునందు గౌలముకంటె మతము, మతముకంటె
త్రికము సర్వోత్తమమగుచు గౌళముకంటె త్రికము పరతరమని తెలియు
చుండగా బైచాటుశ్లోకమువలన గౌలమే సకలోత్కృష్టమని యెటుల
చెప్పనగును?

ఈ భాస్కరునికి బరశురామకల్పసూత్రమను పేర బరగు గ్రం
థము పరమ ప్రమాణముగా నున్నటుల సేతుబంధ గ్రంధమువలన
సువ్యక్తమగుచున్నది. దీనితోపాటు ఇతనికి ప్రమాణ భావముతో
నొప్పు గ్రంధములు ఈ దిగువ నుదాహరింప బడుచున్నవి.

" ప్రపంచ సుందరీ తంత్రేష్వపియాని కులార్ణవ, జ్ఞానార్ణవ,

స్వచ్ఛంద పరానంద, శైరవీ, దక్షిణామూర్తి ప్రభృతీని తేషు ప్రామే. ః బహిర్భాగస్యైవ ప్రపంచో భూయాన్ ॥

శ్రుతిస్మృతి సదాచార ప్రమాణము స్వ్యాభిమతముల దుడిచిపెట్టి కౌళాచారమునకు స్వతః ప్రామాణ్యమును జేకూర్చి భాస్కరుడు తన యభీష్టాచారమునకు శ్రుత్యనుసారిత్వమును ఈ దిగువ నుదాహరించిన క్రమమున నెట్లు సాధింపబూనెనో యయ్యది యొకింత విచారింపబడు చున్నది.

" శ్రీ మహాత్రిపురసుందర్యాశ్చ గౌణీంభక్తిం నేతి కర్తవ్యతా కాం నిరూపయితు మైకంపత్యేన సుందరీ తాపనీ పంచకం భావనోపని షత్, కౌలోపనిషత్. గుహ్యోపనిషత్. మహోపనిషచ్చేత్యా దయో వేదశిరోభాగాః ప్రవృత్తాః। వేదేచ పూర్వ కాండస్య శేషభూ తతయాఽఽశ్వలాయనాదికల్ప సూత్రాణాం మన్వాది -స్మృతీనాంచ ప్రవృత్తి ఏవముపనిషత్కాండ శేషత్వేన పరశురామాది కల్పసూత్రాణాం యామలాది తంత్రాణాంచ ప్రవృత్తిః। పురాణానాంతు కాండద్వయం ప్రత్యపి శేషత్వేన ప్రవృత్తిః। తతశ్చ స్మృతితంత్ర పురాణా నాం వేదమూలకత్వేనైవ ప్రామాణ్యమ్। యేచ ప్రత్యక్ష శ్రుతి విరు ద్ధాస్తత్ర దేకదేశాస్తేషాం విరోధాధికరణ న్యాయేన యావన్మూల శ్రుతిదర్శన మననుష్ఠాన లక్షణ మప్రామాణ్యమ్। యానితు సర్వాంశే నాపి వేదవిరుద్ధాన్యేవ కాని చిత్తన్త్రాణి పాశుపత విశేష పాంచరాత్ర విశేషాదీని తానినేదృశీం భూమికా మారూఢస్య। అపితు శ్రౌతస్మార్త కర్మభూమి కాధికారిణ ఏవ కేన చిత్పాపేన తతశ్చ్యుతా తేష్వధికారః। అత ఏవ —

పాంచరాత్రం భాగవతం తథా వైఖానసాభిధమ్
వేదభ్రష్టాన్ సముద్దిశ్య కమలాపతిరుక్తవాన్.

ఇత్యాదినా కలియుగనామేన పరిగణన ముపపద్యతే.

తేన — శ్రుతిభ్రష్టః శ్రుతిప్రోక్త ప్రాయశ్చిత్తే భయంగతః

క్రమేణ శ్రుతిసిద్ధ్యర్థం మనుష్యస్తన్త్ర మాశ్రయేత్.

ఇత్యత్ర తంత్రసామాన్యపదం తాదృశ విశేషణపరమ్। "పత్యు రసామంజస్యా। దిత్యధికరణ మపి తాదృశ తంత్రపరమేవ"

పై గ్రంథ సందోహమునంతను బరిశీలించినచో, వేదముకంటెం గాళము షడ్గుణాధిక ప్రమాణమని నిర్వచించు వేదముతో సంబంధము లేనిదే తన తంత్రమునకుఁ బ్రామాణ్యము సిద్ధింపదని సందేహముతో న:గా నట్టి వైదిక సంబంధమును సాధింప నెంతయో శ్రమపడుటయు, అందునను తన తంత్రములే వేదావిరుద్ధము లగుటంజేసి ప్రమాణము లనియు పాంచరాత్రాది తంత్రములు వేదవిరుద్ధములగుటంజేసి యప్రమాణములనియుఁ దెల్పుచుఁ తంత్రములన్నియు నింద్యమని చెప్పు ప్రమాణశ్లోకమును తంత్రైకదేశవిషయముగా సాధింప నత్యంతపరస్పరవిరుద్ధముగా వ్యాఖ్యానము గావించుటయుజూడఁగా నీభాస్కరుఁడు తన యర్చనానంతరము పరవశుఁడై ఈ గ్రంథసందర్భమును వ్రాసియుండెనాయను సందేహము దోఁచుచున్నది. ఈ విషయఖండనమున ప్రతివాదులు దెలియరాక పోవుటచే నిందుండి ప్రకృతము విరమింపఁ బడియెను.

భాస్కరుఁడు దనకుఁ బరశురామకల్పసూత్రమునఁగల ప్రామాణ్యమును నిట్లు వివరించియున్నాఁడు—

" కల్పసూత్రస్యతు కణ్వాది పంచదశ శాఖాస్వేకస్య కాత్యాయనీ యస్యైవ పరశురామీ యస్య నిఖిల సుందరీతంత్రేషు అంగత్వా

తన్త్రే రాజాదిష్వపి తదుక్తార్థగ్రహణస్య నిష్ప్రత్యూహతయా సమప్రధానభూత తంత్రాన్తరసాపేక్షత్వాభావ మాత్రేణ అనపేక్షత్వస్యాప్యుపపత్తే రేతత్తన్త్రేఽపి తదుక్తార్థస్య యావదపేక్షమవిరుద్ధం గ్రహణమనపోద్యమ్। అన్యథా పదార్థవ్యుత్పత్తి సాపేక్షత్వేనాపి నైరపేక్ష్యభంగాపత్తేః। తేన సంధ్యాస్నానాదికం కల్పసూత్రాద్ గ్రాహ్య మేవేతిదిక్"

ఈ సేతుబంధమున నొకము గమనింపవలయు విషయ మొండు గలదు. త్రికవాదులగు నభినవగుప్తాదులచేఁ గూడ నీ వామకేశ్వరతంత్రము పూజ్యభావముతో నెన్నఁబడుచున్నటుల — "పరంతు తన్త్రసారే చక్రసంస్కారవిధి ర్వామకేశ్వర తంత్రోక్త ఇత్యుక్తమ్" అను నీ సేతుబంధ వాక్యమునుబట్టి స్పష్టమగుచున్నది. అభినవగుప్తాదులచేఁ గైకొనఁబడిన వామకేశ్వర తంత్రమునకును బ్రకృతమున నీ భాస్కరునిచే స్వీకరింపఁబడిన వామకేశ్వర తంత్రమునకును గడువ్యత్యాసమున్నట్లు పూర్వవాక్యములవలన సుస్పష్టమగుచున్నదిగదా! ఇట్టి వ్యత్యాసమునకుఁగల కారణ మెద్దియు భాస్కరునిచేఁ జెప్పఁబడలేదు. కాని వత్యాసముమాత్రము సర్వవిధముల సత్యమే. ఇట్టులు ప్రాచీనాశ్రిత వామకేశ్వర తంత్రమునకును, అధునాతనాశ్రిత వామకేశ్వర తంత్రమునకును అత్యంత విరోధము పొడగట్టుటచేఁ దుదకు నీ తంత్రమే యెవ్వారిచేతనో గల్పింపఁబడియెనని చెప్పఁదగును, లేనిచో భైరవప్రోక్తమగు తంత్రమున నిట్టి వైరుధ్య మేల సమకూడును? కావున నిట్టి పరస్పర విరోధములచే నప్రమాణమగు నీ గ్రంథమునకు రచితంబులగు నీ సేతుబంధాది వ్యాఖ్యానంబులుగూడఁ బైవిధముగానే యప్రమాణము లగుచున్నవి. ఇట్లు పరస్పర విరుద్ధమై యప్రమాణభూతంబగు నీ తంత్రమునకు భాస్కరుఁ డెందులకు వ్యాఖ్యానము వ్రాయ శ్రమపడియెనను సందేహము కలుగకమానదు. భాస్కరుఁడు తనకు నభీష్టములగు దురాచారములన్నియు నీ తంత్రమూలమున సప్రమాణకంబులగునని

యొంచి దనయభీష్టపదార్థబోధక శబ్దంబులను వ్యత్యస్తాక్షరములచే సూచింపుచు నట్లో లోకప్రతారణమునకై యుద్ధానికి వ్యాఖ్యను అతిశ్రద్ధతో గావించెనను విషయము భాస్కరసిద్ధాన్త విషయ విమర్శకులకుం దోపకపోదు. ఈ భాస్కరుని దార్ఢ్యమెంతటితో ముగియలేదు. సేతుబంధమున భాస్కరుండు శాలివాహనశకము 1655 సం॥ లో రచియించినట్లు వ్రాసికొనెను. నాంటినుండి తన యకృత్యములచే లోక వ్యామోహమునుగల్పింప నెద్దియో యొకతీరునం గొన్ని గ్రంథములను జిత్రించుచుం దుట్టుదుకను శాలిశకము 1688 సం॥ న సౌభాగ్య భాస్కరమను పేరం బరమ పవిత్రమగు లలితారహస్య నామ స్తోత్రమునకుం గలగూఢగంపవంటి యొక కువ్యాఖ్యానమును రచియించియుండెను ఈకువ్యాఖ్యానమున నీతనిచేం బ్రమాణములుగం జేకొనంబడిన గ్రంథములను బరిశీలించినచో నీతండు అభినవగుప్తాదుల త్రికవాదముతో సంబంధించిన పౌరుషేయ గ్రంథములనే ప్రమాణములనుగా స్వీకరించి గ్రంథరచనమును గావించినటుల సువ్యక్తమగుచున్నది అట్టి గ్రంథనామములం గొన్నింటిని దృష్టాంతమునకై దిగువం జేర్కొను చున్నాము.

1 ఈశ్వరప్రత్యభిజ్ఞ, 2 పరశురామకల్పసూత్రము, 3 కాదిమతము, 4 కాదివిద్య, 5 కామకలావిలాసము, 6 కామలావిలాసము, 7 కామికతంత్రము, 8 కామికాగమము, 9 కాళీతంత్రము, 10 కులాగమము, 11 కులార్ణవము 12 క్షేమరాజవృత్తి, 13 చంద్రజ్ఞానతంత్రము, 14 చిద్గగనచంద్రిక, 15 జైనతంత్రము. 16 జ్ఞానార్ణవతంత్రము 17 డామరుతంత్రము, 18 త్రిపురాసిద్ధాంతము, 19 దూతీయాగప్రకరణము, 20 దేవీస్తవము, 21 నారదతంత్రము, 22 నిత్యాతంత్రము 23 నిత్యాహృదయము 24 పంచదశీస్తవము, 25 పరానందతంత్రము 26 పాలినీవిజయతంత్రము, 27 పూర్వచతుశ్శతీ, 28 ప్రత్యభిజ్ఞాహృదయము, 29 బోధసారము, 30 భక్తితంత్రము, 31 భైరవయామళము 32 మల్లారిమహాత్మ్యము, 33 మహామంజరి, 34 మహాస్వచ్ఛందతంత్ర

ము, 35 మహిమ్నస్తోత్రము, 36 మాతృకావివేకము, 37 మృగేంద్ర సంహిత, 38 మైరాళతంత్రము, 39 యోగినీహృదయము, 40 రత్నహృదయాంచార్య పద్ధతి, 41 రుద్రయామళము, 42 రేణుకారాణకము 43 లఘుస్తవము, 44 లలితాస్తవరత్నము, 45 సుభగోదయటీక. 46 వరివస్యా ప్రకరణము, 47 వరివస్యారహస్యము, 48 వామకేశ్వరతంత్రము, 49 వారాహితంత్రము, 50 వాసనాపటలము, 51 వాసనాసుభగోదయము, 52 విజ్ఞానభాస్కరము, 53 విరూపాక్ష పంచాశిక, 54 వ్రతఖండము, 55 శక్తిరహస్యము, 56 శక్తిసూత్రము, 57 శాకుంతలము, 58 శాండిల్యసూత్రము, 59 శాబరచింతామణీ, 60 శాంభవానందకల్పలతా, 61 శారదాతిలకము 62 శివసూత్రము, 63 శివసూత్రవిమర్శిని, 64 శివస్తవము, 65 శైవసూత్రవార్తికము, 66 శ్యామలారహస్యము. 67 శ్రీకంఠభాష్యము, 68 సంకేతపద్ధతి, 69 సమయాచారస్మృతి, 70 సుందరీమహోదయము, 71 సుభగార్చాపద్ధతి 72 సేతుబంధము, 73 సౌభాగ్యరత్నాకరము, 74 స్పందశాస్త్రము, 75 స్వచ్ఛందతంత్రము, 87 స్వతంత్ర తంత్రము,

ఈ గ్రంథములన్నియు నించుమించుగాఁ ద్రిక సంప్రదాయాభిమానులగు వామాచారులచే ప్రమాణములుగాఁ బేర్కొనఁబడుచున్నవియే. ఇవి యన్నియు శ్రుతిస్మృతి సదాచార ప్రమాణ విదూరములే. ఇట్టి సత్ప్రమాణ విదూరములును దురాచారానుయాయులును నగు పౌరుషేయ గ్రంథాభాసముల శ్రుతిస్మృతి సదాచారసిద్ధమగు ప్రమాణ నిర్ణయముచే నీ గ్రంథములకుఁ బ్రమాణ భావ మొంతమాత్రము చేకూరనేరదు. "త్రికాత్పరతరంనహి" "శాక్తాత్పరం నహి'' యను చాటుధార వాక్యములనే ప్రమాణములుగా స్వీకరించినచో నీ గ్రంథములన్నియు స్వతః ప్రమాణములే యగుచున్నవి. ఈ గ్రంథములకు స్వతః ప్రామాణ్యమునిచ్చి శ్రుతిస్మృతి సదాచార సిద్ధమగు ప్రమాణ నిర్ణయమును ద్రోసిపుచ్చినచో నీసౌభాగ్య భాస్కరమను లలితా సహస్ర

స్తోత్ర వ్యాఖ్యానము ప్రమాణ పదమునందఁగలదు. కాని శ్రుతిస్మృతి సదాచారప్రమాణములను ద్రోసిపుచ్చి చాటుధారలచేఁ జైగ్రంథాభాసములకు ప్రమాణభావము నాపాదించుటకు జాతివర్ణకుల గోత్రశీలాది ధర్మముల స్వచ్ఛంద ముగవిడనాడి స్వేచ్ఛఁ జరించు వామాచారాగ్రగణ్యులగు త్రైకులును కౌళికులును నీ సౌభాగ్య భాస్కరమును ప్రమాణమని తలంచినం దలంపుదురు గాక అహహా పరమపవిత్రములగు లలితా రహస్య నామస్తోత్రమున కెంత దుర్గతి వట్టెను! ఇయ్యది భాస్కరునియొక్క యుపాసనా మహిమ!! ఈ వ్యాఖ్యానభారమును నీతని యందునిచి శ్రీశంకరభగవత్పాదులకు నాశ్రమ తొలగించిన యా పరాదేవత యెంతి ధన్యురాలో గదా!! ఈ విషయమున గౌళికుల సంతుష్టి నేమని చెప్పవచ్చును! ఆహా సౌభాగ్య భాస్కరముయొక్క ప్రాశస్త్యము నెద్దానినిగనిపెట్టి వీరలు సంతుష్టి జెందుచున్నారు? సౌభాగ్య భాస్కరము మద్యమాంసాది భక్షణమునకు యథేచ్ఛముగ నభ్యనుజ్ఞ నిచ్చుచున్నదనియా లేక దానియందెద్ది యేని విశేషముగలదనియా? వేరొక విశేషముతో ద్రైకులకును గౌళికులకును బనియేమి! శ్రుతిస్మృతి సదాచార ప్రమాణానుసారములగు జాతి వర్ణకులగోత్ర శీలాదికమును ద్రోసి పుచ్చి నిజేచ్ఛ భక్ష్యాభక్ష్యాది విచారణ మించుకేనియు లేక చరించినఁ జాలును! దానం జేసియె ప్రకృతకాలమున నీ కౌళికులకు నీసౌభాగ్య భాస్కరమనెడి లలితా సహస్రనామ స్తోత్రవ్యాఖ్యానంబునఁ గల ప్రీతి. వేయేల! త్రైకులును దమ యాచారమునకు నతిశయము గల్పించుకొను వాదమంతయుఁ జార్వాకులు వేదముల నపహసించు వాదముల ప్రతిరూపమే కాని వేరొండు యెంతమాత్రముగాదు. కావున నీ త్రైకుల యొక్కయుఁ గౌళికుల యొక్కయు వాదములన్నియు శ్రుతిస్మృతి సదాచార ప్రమాణానుయాయులచే దూరముగ బరిహరింప దగినవే. వేయేల! శ్రేయస్కాములగు శ్రుతిస్మృతి సదాచారబద్ధులెల్లరును నీ భాస్కరుని గ్రంథాభాసములను నందుననునీ సౌభాగ్య భాస్కరమను లలితా సహస్రనామ వ్యాఖ్యానా భాసమును

హేయముగా దలంచుచు దూరముగా ద్రోసి సుఖంబును బడయుదురు
గాక! ఇంతియగాదు భాస్కరునిచే ప్రమాణముగ నుదాహరింపబడిన
కులార్ణవాది తంత్రములును బరమ ప్రమాణముగా నిర్వచింపబడిన
పరశురామ కల్పసూత్రమును దదనుగుణంబగు నిత్యోత్సవంబును శ్రేయ
స్కరములగు ద్విజు లెంతమాత్రము నుస్పృశింపకుండుట అత్యంత శ్రే
యోదాయకము. పరశురామ కల్పసూత్రము తదనుగుణమగు నిత్యో
త్సవాది విధానములును "శ్రుతి భ్రష్టః శ్రుతిప్రోక్త ప్రాయశ్చిత్తేర
యం గతః॥ క్రమేణ శ్రుతి సిద్ధ్యర్థం మనుష్యస్తంత్ర మాశ్రయేత్" అను
న్యాయమును బట్టి వేదాధికార విహీనులగు ననులోమ విలోమ జాతు
లవారలకు నొకప్పుడుపయోగించిన నుపయోగింపవచ్చును గాని వైది
కాచార పరాయణుల కెంతమాత్రముపకరింపక పోవుటచే నీయువి వార
లచే నెంత మాత్రమాశ్రయ ణీయంబులుగావు. శ్రుతిస్మృతి సదాచా
రానుయాయులు శ్రద్ధతో గమనింప వలయు విషయము.

లలితా రహస్య వ్యాఖ్యానాతిశయమును గూర్చి కౌలాభి మా
నులు ప్రకటించుకొను నతిశయమునకు భాస్కరునితో సంబంధించిన
యొక యితిహాసము పూర్వముగ నుదాహరింప బడుచున్నది. అద్దాని
నిగుణ దోషములను బ్రకృతము విచారించుట యప్రస్తుత ప్రశంసయెం
తమాత్రము గానేరదు. అట్టి యైతిహ్యము గూడ బ్రకృతమున బొం
బాయి నగరమున ముద్రింపబడిన లలితా వ్యాఖ్యానమున కనుబంధ
ముగ నుపోద్ఘాతమున బ్రకటింప బడినది. వాస్తవముచే నీయితిహాసము
కల్ల. మకారప్రియుల స్వకపోల కల్పనా విశేషమే గాని వేరొండు
గాదు. అదియట్లుండు గాక ఈ యితిహాసము నందలి ముఖ్యవిషయ
ము ఈ భాస్కరునిచే గమలాకర భట్టుయొక్క తాతయగు నారాయ
ణభట్టు కాశీనగరమునందలి పండితులందరితో బాటు పరాభవింపబడె
ననియు నందుచే నీ భాస్కరుడును ఈతని గ్రథములును అభ్యర్హితము
లనియును. ఏతద్విషయమున ముందు నీ భాస్కరుడు నారాయణభట్టు
నకు సమకాలికుడాయను విషయము విచారింపబడవలయును. ప్రకృత

మున నీ యనుబంధమునందు గమలాకరభట్టుయొక్క కాలముదాహ రింపబడి తన్మూలమున నారాయణభట్టు కాలమును బిమ్మట భాస్కరు నికాలమును నిర్ణయింపఁబడియున్నది, ఎట్లనగా కమలాకరభట్టు కాల మిటుల నిర్ణయసింధునందు నిర్ణయింపఁబడియున్నది.

"వసుఋతు ఋతుభూ (1668) మితేగతేబ్దే
నరపతి విక్రమతోఽథయాతి రౌద్రే
తపసి శివతిథౌ సమాపితోఽయం
రఘుపతి పాద సరోరుహేఽర్పితశ్చ॥

దీనినిబట్టి కమలాకరునికాలము విక్రమశకము 1668 సం॥ అని తెలియుచున్నది. అతని తాతయగు నారాయణభట్టుకాలము పైకమలా కరుని కాలమునకు నేబది సంవత్సరములు కల్పినచో సిద్ధించును. భాస్కరుని కాలమన్ననో 1655 సం॥ రచింపఁబడిన సేతుబంధమును బట్టిచూడగా ఈవత్సరము విక్రమశకమునకే సంబంధించినచో కమలా కరుని కాలమునకు సమానమగు కాలమేయని స్పష్టమగుచున్నది. కాఁగా ఈ భాస్కరుడు కమలాకరుని కాలమువాడు అయినచో గావ చ్చునేమో గాని, యాతని తాతయగు నారాయణభట్టు కాలమువాడు కాడని స్పష్టముగా దెలియుచున్నది. వత్సరములన్నియు గాశీపండి తులచే నుట్టంకింపఁబడుటచే నయ్యవి విక్రమశకమునకు సంబంధించినవే గాని వేరుగాదు. ఈ భాస్కరుఁడిచ్చిన వత్సరములు శాలివాహన సంవత్సరములే యైనచో నాతడు కమలాకరుని కంటెగూడ దరువాతి వాఁడు అగును. కమలాకరుడిచ్చిన వత్సరములు విక్రమశకమునకు సం బంధించినవే యని వ్రాసికొనుటచే నాతని వత్సరములు విక్రమశకము నకు సంబంధించినవే గాని శాలివాహన శకమునకు సంబంధించినవి గావు. ఇంక భాస్కరుడు తన గ్రంథమున శక విశేషోట్టంకనముచే సంవ త్సరములను నిరూపింపక కేవలము సంవత్సరములను మాత్రము నిరూపిం

చుటచేతను, శకవిశేషగ్రహణము లేక నిరూపింపఁబడిన సంవత్సరములు శాలివాహన శకమునకే సంబంధించినవగునని విమర్శకుల నిర్ణయముండుటచేతను, నీ భాస్కరుని కాలము యథార్థముగఁ గమలాకరుని కాలముకంటెఁగూడ నర్వాచీనమే యగుచున్నది అనగా నీ భాస్కరుడు కమలాకరుని తర్వాత నూటముప్పదినాలుగు సంవత్సరములకున్న వాడని చెప్పవచ్చును. కనుక కమలాకరునికే ఎంతయో నవీనుఁడగు భాస్కరుడు కమలాకరుని తాతయగు నారాయణభట్టుతో వాదమునకు గడంగెనను నీ యితిహాసము సంపూర్ణ కాల్పనికులచేఁ గల్పింపఁబడినదే యగుచు శ్రుతిమార్గానుయాయుల హాసపాత్రమగుచున్నది. అదియునుగాక ఈ భాస్కరుడు వ్రాసిన దుర్గాది పూజావిధానమంతయు నతడు చెప్పినప్రకారము రహస్యప్రదేశములయందే గొప్పగా నాచరింప వలసినదిగాక, ప్రకటముగానే చేయవచ్చుననుటకు కమలాకరుని నిర్ణయసింధువునందలి నవరాత్రారంభ ప్రకరణముబట్టి చెప్పవచ్చును. ఇందీతడు ప్రతిపత్తుమొదలు సమాప్తిదిన పర్యంతము చేయవలయు నవరాత్ర కర్మ కలాపమునంతయును దత్తచ్చాతుర్వర్ణభేద మూలకమగు అర్చనా సంభారములతోఁగూడ బహిరంగముగ వివరించియున్నాడు. అందు ఈ భాస్కరాది వామాచారులు చెప్పుదుష్ప్రవాదముల కించుకేనియు నవకాశములేదు. ఈ కమలాకరుడు దాను వ్రాయువిధానము నంతయును నిర్విచికిత్సముగ వైదికాచారానుగుణముగ నిర్ణయించి యున్నాడు. కమలాకరుని కాలముననే ఈ భాస్కరుని దుర్మార్గము తెలియవచ్చినచో కమలాకరుడు దన గ్రంథమున సర్వవిధముల నీ భాస్కరునాచారమును శతథాఖండించి యుండువాడే! అట్టిఖండన మీతని గ్రంథములయందు గానరామింజేసి యీ భాస్కరుడు కమలాకరుని తాత నాటివాడే గాక కమలాకరుని నాటివాడుగూడఁ గాఁడని స్పష్టమగుచున్నది. దీనినిబట్టి పై యితిహాసముపట్టి బూటకమని స్పష్టము. ఇంక విశేషమేమనగా నిర్ణయసింధువును జూచి తన్నిర్ణయముననుసరించి ధర్మమును నిర్ణయించిన కాశీనాథోపాధ్యాయుడు తన ధర్మసింధు గ్రంథ

మున నవరాత్రారంభ ప్రకరణమును వివరించుచు నందు నిర్ణయ సిం
ధూక్త ప్రకారముగ శ్రుతిస్మృతి సదాచార సిద్ధమగు నవరాత్రి విధాన
మును వివరించి యందు దన కాలమునం జాటు చాటుగా బయలు
వెడలిన దురాచార ప్రవర్తకులను వారి ప్రచ్ఛన్నాచారమును సంపూ
ర్ణముగ గర్హించుచు నందుం బ్రధమున ఈ భాస్కరునే పేర్కొనెను.

నవీనతరా భాస్కరరాయ ప్రభృతయోపి సప్తశదతీటీకాదా
ప్రాచీన గ్రంధా ననుసృత్యైవ మేవ పరి కుర్వన్తః సభాయాం చైతన్మత
మేవ శ్లాఘంతే, చాచరణంత్వన్యధా కుర్వన్తి. తంత్రోక్తాన్వయం దుర్దైవా
వప శేన బ్రాహ్మణ్య భ్రష్టాభావమ స్యైవ్యేవం మా భూవన్నితి భూత
దయ యావాస్యపాతిత్య గోపనాయ వాఽన్యేపాంకలి యుగస్థ విప్రా
ణామధికారా భావా లోచనయా వేతి నవయం తత్వంజానీమః."

ఇందు "నవీనతరా...శ్లాఘంతే...కుర్వన్తి" అను పదప్రయో
గములచే నీ భాస్కరాదులు కాశీ నాధోపాధ్యాయుని సమకాలికులే
యని నిర్ణయించుచు ఈ కౌళమును శ్రుతిస్మృతి సదాచార సిద్ధమగు
దక్షిణాచారమను పేరట వ్యవహరించుచు ప్రచ్ఛన్నముగ దుర్మార్గము
నకుం గడంగుట ఈ కాశీనాధుని కాలముననే ప్రారంభమైయున్నద
నియు నందుచేతనే యాతడు తన గ్రంధమున ఈ యాచారమును
రూపుమాపం దలంచెననియు రూఢియగు చున్నది. దినిని బట్టి భాస్క
రుడు గాశీనాధుని కాలము వాడేయగుటచే పై కథ ఎంత మాత్రము
సత్యము గాదని తెలుచున్నది గదా! ఇట్టి అసత్యదోష దూషితమగు
నీ కథను విశ్వసించు వారికి గూడంగధా ప్రణాళికను బట్టి సదాచార
సదుపాసనా పూరితంబగు కాశికాపురి యందు నీ భాస్కరుని యాచా
రము హేయమని తలంప బడుటకుం గారణము. వామ మద్విజులకు
దూష్యమగుటయే యనియు, ఈ భాస్కరుని నచటివారు దూలనాడు
టకు నా దూష్యాచార మును వైదిక భ్రష్టతకొంకు ద్విజకులమునిందు
బ్రవేశ పెటుచున్నాడనియు స్పష్టముగా దోపలేదా! యథార్థముగ

సాలోచించినచో నీ భాస్కరునియాచారమును స్తుతించు కుంకుమానం దుడెట్టివాడో ప్రాజ్ఞ లోకమునకు వేరుగాఁ జెప్పనవసరములేదు. ఈ కుంకుమానందునికి వర్ణింపబడు మహాత్వము విప్రవినోదులకుఁ గూడాఁ గలదని వేరుగాఁ జెప్పవలయునా? కావునఁ గాలమునుబట్టి గాని విషయమును బట్టిగాని యీభాస్కరౌన్నత్య బోధకమగు నితిహాసములు విబుధలోకమునకు హాస్య హేతువే యగుచున్నవి. కావున నీ యితిహాసముల మూలమున ఈలలితా సహస్రవ్యాఖ్యానా భాసములకు గాని మద్యమాంసాది పూరితమగు వామాచారమునకుగాని శ్రుతిస్మృతి సదాచారములచే నెంతమాత్రము గతి కల్పింప నవకాశములేదని చెప్పవలయును.

ఇంతియగాదు, ఈ కౌలికులు దలంచునట్లు దుర్గోపాసనయు, శ్రీవిద్యయుఁ దాంత్రికమే యెంతమాత్రముగాక శ్రుతిస్మృతి సదాచార ప్రమాణములచే సర్వవిధముల ననాదిగ వైదికలోకమునఁ బ్రవర్తింపజేయఁబడియే యున్నవి. కాని భాస్కరాదులవంటి దుష్ట కౌళికుల ప్రచార విశేషముచేతను, శ్రీ విద్యయందు వైదికులకుఁ గల యుపేక్షచేతను, భాస్కరుని కాలమునుండి నేఁటి వరకును శ్రుతిస్మృతి సదాచారమగు శ్రీ విద్య లుప్తప్రాయమై తాంత్రికమగు కౌలాచారమును గనుచున్నది. ఇట్టి దుష్ప్రచారమునకు వగచు సదాచారులు అచ్చటచ్చట నున్నను గలి ప్రాబల్య వశమున వారల వ్యవహారము నివురు గప్పిన నిప్పువలె మరుగుపడియున్నది. అట్టివారల సంఖ్యయు గూడ స్వల్పము గనే యుండుటలోఁ బ్రకృతకాలమున నాశ్చర్యములేదు. ఇట్టిపరిస్థితుల యందు నస్మద్గురువర్యులగు శ్రీ విద్యాశంకర పదమావేశ ప్రకాశిత జగద్గురు శ్రీ బోధానంద భారతీ మాంతాచార్యమహా స్వాములవారు శ్రుతిస్మృతి సదాచార సిద్ధమగు శ్రీ విద్యకుఁదగు నుద్బోధము అస్మదీయ శక్తి కొలది గావించి సత్సంప్రదాయమును బ్రవర్తింప జేయవలయునని యానతీయగా నట్టి యాజ్ఞను గురుదేవతా రూపిణీయగు పరదేవత

యొక్క యాజ్ఞగా భావించి శిరసావహించి యట్టిభారమును నిర్వహింపసామర్థ్యమును గలుగఁ జేయునావరమేశ్వరిని నిరంతరముపాసించుచు నా పరమేశ్వరి యనుగ్రహము వలన సదాచారబోధకములగు గ్రంథములను రచించి ప్రకటించుచు నవ్వానిచే జగద్గురుదేవతను దృప్తిపరచి దన్మూలముగ నా పరదేవత సావకాశము గల్గినంతవరకు శిష్యవర్గము నందు యథాధికారము శ్రీ విద్యోపాసనమును మేము ప్రవర్తింపఁ జేయు టెల్లరకు దెలిసిన విషయమేగదా! వాస్తవముచే సదాచార బోధకములగు గ్రంథము లించు మించుగా లుప్తప్రాయమై దురాచార బోధకకములగు పరశురామ కల్పసూత్ర, భాస్కరరాయకృత సేతుబంధ, పరివస్యారహస్య, లలితా సహస్రనామ వ్యాఖ్యాభాస కులార్ణవ, జ్ఞానార్ణవ తంత్రములు మున్నగు దుష్టగ్రంధములు ప్రకృతమున నెక్కుడు ప్రచారమును గల్గియుండుట లోకమునఁ గన్పట్టుచునే యున్నది. అట్టి దుష్టగ్రంధముల వల్లఁగలుగుచుండు ముప్పునుఁ దొలగింపఁ గోరువారు చేయూతఁ గొనుటకుఁ గాను మాచే రచింపబడిన గ్రంథములనిట జేర్కొను చున్నారము;—

1. పూర్ణమీమాంసాదర్శనము.
2. శ్రీ విద్యాదర్శనము.
3. శ్రీ మాతృకాదర్శనము.
4. శ్రీ చక్రదర్శనము.
5. శ్రీ యోగసూత్రము.
6. తంత్రజ్యోత్స్న.
7. సంధ్యాకలా.
8. అక్షర దర్శనము.
9. శ్రీ కలాదర్శనము.
10. కల్యాణి యను లలితా సహస్రనామస్తోత్రవ్యాఖ్య

11. కల్యాణ శ్రీకలయను శ్రీ లలితా రహస్యనామ వ్యాఖ్య
12. బ్రహ్మకళ.
13. శ్రీ గుణనికాదీధితి.

ఈ గ్రంథములను అనాద్యవిచ్ఛిన్న గురుపరంపరా ప్రాప్తమగు భారతీ సంప్రదాయముచేఁ బ్రవర్తింపజేయ బడుచున్న శ్రీ విద్యారహస్యబోధకములుగాఁ దెలిసికొని యవ్వాని వలనఁ బ్రాజ్ఞులు సత్సంప్రదాయమును గ్రహించి యద్దాని వలన నైహికాముష్మిక నిశ్శ్రేయసంబుల బడయుదురుగాక.

" ఇతి నారాయణస్మృతిః "

26—7—1953



Printed at the Kasturiba Press, Guntur.